# ప్రపంచ రాజకీయాలలో నూనె సమస్య

ఆదియన్. ఆర్దేషీర్

2

[గత సంచిక తరువాయి]

నూనె పరిశ్రమ చరిత్రను అవగతం చేసుకుంటే, ఆదిలో ప్రైవేటు వ్యాపారస్తుల చేతుల్లో వుండే యీ పరిశ్రమ, క్రమేణా ఆయా ప్రభుత్వాల చేతుల్లోకి మారినట్టు మనకు తెలుస్తుంది. పారిశ్రామికంగా, యూరోపియన్ దేశాలు, అభివృద్ధి చెందినకొద్దీ నూనెయొక్క అవసరంయెక్కువైంది. దీనికితోడు యుద్ధ కార్యకలాపాల నిర్వహరణలో, నూనె ప్రధానమైన అవసరంగా కనుపించటంతో, ఆయా ప్రభుత్వాలు, ఈ పరిశ్రమను స్వయంగా లేమరీను చేతుల్లోకి సంక్రమింపజేసుకోవటానికి ప్రయత్నించినై. దాంలో ఆయా ప్రభుత్వాల మధ్య పోటా పోటీలు బయలుదేరినై.

## పోటా పోటీ

కాని యీ పోటీలోకి దూకటం అన్ని ప్రభుత్వాలూ ఒకేసారి దూకలేదు. మొదటి ప్రపంచ యుద్ధానికీ, రెండవ ప్రపంచ యుద్ధానికీ మధ్య కాలంలో, తక్కిన-ప్రభుత్వాలన్నీ నూనె పరిశ్రమలో హక్కులు సంపాదించటానికి తాపత్రయ పడుతూన్న సమయంలో, అమెరికా ప్రభుత్వం చాలా రోజులు ఉపేక్షగా ఊరుకుంది; సింక్లర్ అనే అమెరికా వ్యాపారస్థుడు; పర్షియన్ నూనె పరిశ్రమలో హక్కులు సంపాదించటానికి భగీరథ ప్రయత్నం చేశాడు. కాని వాషింగ్టన్ ప్రభుత్వం యితనికి యేవిధమైన సహాయమూ చెయ్యలేదు. 1920, 21 సంవత్సరాలలో అమెరికా వ్యాపారస్థుల ప్రభుత్వం నుంచి కొంత ఒత్తిడి వచ్చింది. అప్పుడే అమెరికా ప్రభుత్వం, ఇరాన్‌లో స్వేచ్ఛా వ్యాపారం వుండాలని పట్టు బట్టింది. కాని అమెరికా ప్రభుత్వం అవసరం కొద్దీ, కావాలని కార్య రంగంలోకి దిగింది. మరొక యిరవై సంవత్సరాల అనంతరం; అంటే రెండో ప్రపంచ యుద్ధం నెత్తిమీదికి ముంచుకొచ్చిన అనంతరం; 1914 యుద్ధానంతరం, బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్సు మొదలైన యూరోపియన్ దేశాలు, యుద్ధ నిర్వహణకు నూనె అత్యవసరం అనే విషయాన్ని అమెరికా కంటే ముందుగా గ్రహించ గలిగినై. అందుకే త్వరపడి, బ్రిటన్ మైనా అమెరికాలలోనూ, ఫ్రెంచి వాళ్లు యిండోచైనా లోనూ, డచ్ వాళ్లు ఇండోనేషియా, ఇండో చైనాలలోనూ, పెద్ద పెద్ద వ్యాపార సంస్థలను అభివృద్ధికి తెచ్చుకున్నారు. ఒక సెంపు సర్ హెన్రీ డెటరింగ్ (బ్రిటిష్) అంతర్జాతీయంగా పెద్ద వ్యాపారాన్ని పెంచుకు రావటానికి ప్రయత్నం చేస్తున్న తరుణంలో, అమెరికా లోగడవున్న స్టాండర్డ్ ఆయిల్ కంపెనీని విచ్ఛిన్నం చేయటానికి పూనుకుంది.

నూనె పరిశ్రమలో ప్రభుత్వాల జోక్యం, మొట్టమొదట 1890 లో ప్రారంభమైంది. ఆ సంవత్సరం హేగ్ లో 'రాయల్ డచ్ కంపెనీ' స్థాపనకు యేర్పాట్లు జరిగినప్పుడు, ఆ కంపెనీ నిబంధనావళిలో, ప్రధానమైన షేర్లు డచ్ వాళ్ల చేతుల్లోనే వుండాలనే అంశం ఒకటి చేర్చారు. అనాటి దినాలయితే యీ నాటివరకూ, ఆ కంపెనీ షేర్లలో, అధికభాగం డచ్ రాజకుటుంబంవారి చేతుల్లో వుంటూ వచ్చినై.

ఆసియాకు కావలసిన నూనెంతా రాయల్ డచ్ కంపెనీయే సరఫరా చేస్తూ వుండేది. అనంతరం 7 సంవత్సరాలకు, రష్యన్ కిరసనాయిలు చేజిక్కించుకుని, 'షెల్ ట్రాన్స్‌పోర్ట్ అండ్ ట్రేడింగ్ కంపెనీ' ఆసియా వ్యాపార రంగంలోకి అడుగుపెట్టింది. అనంతరం బోర్నియో, డచ్ ఇండీస్ దీవులలో యెక్కువ నూనె లభించటంతో పై రెండు కంపెనీలూ, 'రాయల్ డచ్ షెల్' అనే పేరయేకమై ఈ నాటివరకూ పనిచేస్తూ వచ్చినై. ఆసియా నూనె వ్యాపారమంతా యిందుమూలంగా ఈ వ్యాపార సంస్థ చేతిలోనే వున్న దనటంలో అతిశయోక్తి లేదు.

రాయల్ డచ్ - షెల్ 'కంపెనీ క్రమేపీ, యింకా పెంచుకొని, నూనె నిధులలో వున్న మరిమూడు పెద్ద పెద్ద నూనె కంపెనీలను తన ఆధిపత్యం క్రిందకి లాక్కొగలిగింది. అనంతరం, ఇంకొంచెం ముందంజవేసి కాకస్, గ్రాజ్నీ ప్రాంతాల నూనె కేంద్రాలను స్వాధీన పర్చుకుంది. నాకేసి ప్రాంతం ఆ రోజుల్లో, రష్యా అంటిటిలోనూ, పెద్ద ఉత్పత్తి కేంద్రంగా వుండేది. 1918 లో ...లో, మరికొన్ని లాటి హక్కులు సంపాదించింది. నూనె వ్యాపారం కొరకు ఈ దేశంలో మొదట అడుగు పెట్టింది యీ కంపెనీయే. అంతకు ఒక సంవత్సరం పూర్వమే మెక్సికోలో కొన్ని కార్యకలాపాలకు ఉపక్రమించింది; అమెరికా సంయుక్త రాష్ట్రాలలోకి కూడా చొచ్చుకుపోయి చాలాను చిన్న చిన్న కేంద్రాలు స్థాపించింది. ... కేంద్రాన్ని స్థాపించింది. ఈ కేంద్రం యీ నాటికీ ప్రపంచంలోకల్లా మహాసమృద్ధమైన పరిశోధనా కేంద్రమని చెప్పవచ్చు.

'రాయల్ డచ్-షెల్' కంపెనీలో అధికభాగం షేర్లు డచ్ రాయల్ కుటుంబం చేతిలోవున్నా ఈ కంపెనీ వ్యవహారమంతా బ్రిటన్ సారధ్యంలో నడుస్తున్నా యన్నమాట నిజం. ఈ కంపెనీ ఇలా వుండగా నూనె వ్యాపారంలో, అంతర్జాతీయంగా ప్రముఖస్థానాన్ని వహించివున్న రెండవ సంస్థ 'ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీ' ఈ కంపెనీనే ఈమధ్య, ఇరాన్ ప్రభుత్వం జాతీయసంస్థగా ప్రకటించింది.

## ఇరానియన్ ఆయిల్ చరిత్ర

ఇరానియన్ ఆయిల్ కంపెనీ ప్రారంభదశలో బ్రిటిష్ ప్రభుత్వానికి యేవిధమైన జోక్యమూ వుండేదికాదు. ఈ రంగంలో మొట్టమొదటగా హక్కులు సంపాదించినవాడు, ఆస్ట్రేలియా వాస్తవ్యుడు డార్సీ (1901); 1914 వరకూ ఇరాన్ ఆయిల్ సంస్థ పెద్ద అభివృద్ధికి వచ్చిందేమీలేదు. అప్పటికి యిక్కడి నూనెకోసం ఆయా ప్రభుత్వాలు పోటీకి దిగిందికూడా లేదు.

1907 ఇక్కడ కావలసినంత నూనె భూగర్భంలో వున్నదన్న విషయం బైటపడ్డది. అబడాన్ నూనె గనుల చుట్టూ భూగర్భంలోకి ఉక్కుగొట్టాలు బోరింగుచేసి దించితే, వాటిలోనుంచి అదుపు చెయ్యటానికి కూడా సాధ్యం కాకుండా నూనె ప్రవాహాలు సెలయేళ్లలా బయటికి పొర్లిపోయినై. నంటనే పెట్టుబడి చాల డార్సీ కంపెనీ 'బర్మా ఆయిల్ కంపెనీలో' లీనమైపోయింది. 'ఇదే పర్షియన్ ఆయిల్ కంపెనీ.'

కొత్తగా బయటపడ్డ యీ నూనె గనులన్నీ త్రవ్వించటానికీ, శుద్ధి కేంద్రాలూ, సరఫరా సౌకర్యాలూ నిర్మించటానికీ, యీ కొత్త కంపెనీకి కూడా పెట్టుబడి చాలకపోయింది. అందుచేత అప్పట్లో ఆ కంపెనీ అధ్యక్షుడుగా వున్న లార్డ్ స్ట్రాత్ కోనా, 'రాయల్ డచ్-షెల్' కంపెనీతో భాగస్వామ్యానికి సరితే బాగుంటుందని ఆలోచించాడు. డచ్ రాయల్ కంపెనీదగ్గర పుష్కలంగా డబ్బువున్నది గనక అలా చేస్తే బాగుంటుందని ఆలోచించాడు; కాని, బ్రిటిష్ నౌకాశాఖలోని అన్ని నౌకల నౌకలనూ, ఆయిల్ ఫ్యూయల్ తో నడిచేటట్టు మార్చాలని, అప్పటికి నౌకాశాఖ అగ్రాధికారులు, లార్డ్ ఫిషర్, విన్‌స్టన్ చర్చిల్ ఆలోచించుచున్నారు. అందుచేత డచ్ రాయల్ కంపెనీతో కలిసే వ్యవహారం అపమనీ, బ్రిటన్ నుంచే ఆర్థికసహాయం లభించే వరకూ కొంతకాలం వేచివుండవలసిందనీ లార్డ్ స్ట్రాత్ కో నాకు సలహా యిచ్చారు.

1914 బ్రిటిష్ ప్రభుత్వం ఈ కంపెనీని స్వయంగా స్వాధీనం చేసుకోవటానికి పార్లమెంటులో ఒక బిల్లును ప్యాసు చేయించింది. 1914 సంవత్సరం, ఆగస్టు 10 వ తేదీ బ్రిటిష్ రాజు ఈ బిల్లును ఆమోదిస్తూ చేవ్రాలు చేశారు. ఇంతలోనే మొదటి ప్రపంచ యుద్ధం సంభవించటం, నూనె విలువ తారాపథానికి తేవటం జరిగింది. దాంతో ఈ నూనె పరిశ్రమ కేవలంవ్యాపారవ్యవస్థగావుండే అవకాశాంతప్పి, ప్రభుత్వాల జోక్యం అనివార్యమైంది.

## ఉత్పత్తుల అభివృద్ధి

1914-1952 సంవత్సరాల మధ్య ఇంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీ ఎంతో అభివృద్ధిలోకి వచ్చింది. బ్రహ్మాండమైన శుద్ధి కేంద్రాలను మూడింటిని నిర్మించారు. అబడాన్‌లో నిర్మించిన కేంద్రం చాలా పెద్దది. అనేకరకాల క్రొత్తగనులు కనుక్కొని పరిశ్రమను ఎంతో అభివృద్ధికి తెచ్చారు. ఈ కంపెనీ సగటున రోజుకు 883000 పీపాల క్రూడ్ ఆయిల్‌ను ఉత్పత్తిచేసే స్థితికి వచ్చింది. 1939 నాటికి సంవత్సరానికి 8 కోట్ల పీపాలనూనె ఉత్పత్తి అవుతూ వుండేది. ఇరాన్‌లో తయారైనంతనూనె, ఒక్క అమెరికాలో తప్ప యింకే దేశంలోనూ తయారుకాదు.

కాని వచ్చిన చిక్కేమిటంటే, 'ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీ' ఎలా త్వరితగతిని అభివృద్ధిలోకి వచ్చిందో, మున్నెన్నడూ ... బ్రిటిష్ ప్రభుత్వపు పలుకుబడి అంత త్వరితంగాను దిగజారిపోయింది. 1951 మార్చిలో, పశ్చిమదేశాలంటే కాస్త సానుభూతి వుండే ఇరాన్ ప్రధాని అలీరజ్మారాను హత్యచేశారు. 'ఇరానియన్ ఆయిల్' జాతీయం చేయాలనే నినాదంతో మొసాదిక్ ప్రధాన మంత్రి కుర్చీ ఎక్కాడు. కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో నడుస్తున్న టూడే పార్టీ యిందుకు చాలా మద్దతు చేసింది. కాని ఉన్న చిత్రమేమంటే, ఈ నూనెసంపదనుంచి బ్రిటిష్ ప్రభుత్వానికి దక్కిన ఆదాయంలో వాల్చిచూస్తే; ఇరాన్ ప్రభుత్వానికి దక్కింది యేమీలేదని చెప్పవచ్చు. పన్నులరూపంలో కాస్తా కూస్తా యిచ్చి కళ్లనీళ్లు తుడుస్తూ వచ్చారు.

## బ్రిటిష్‌వారి గాబరా

మొసాదిక్, ఆయిల్ కెంపనీని పై ... జాతీయం చేయటంతో బ్రిటిషు వారికి గాబరా పుట్టింది. ... నోటీసు లేవనేవి, చట్టం లేవనేవి తెలో, ... కాని లాభం లేకపోయింది. అనేక సంవత్సరాలుగా ఆర్థిక పీడనకు లోనైవున్న ఆ ప్రజ, ఈ యెత్తులు పారనివ్వారుగాదు. ఇరానియన్ మజ్లీస్‌లో బిల్లు ప్యాసయిపోయింది. బ్రిటిష్‌వారు ఈ చర్యను ఆమోదించమని మొండి చరవటంతో, 'కేచిక్కు-చుట్టె', మొసాదిక్, అబడాన్ లోవున్న ఆంగ్లేయ విద్యానిపుణుల నందర్నీ బర్తరఫ చేశాడు — వాళ్లు లేకుండా వ్యాపారం నడపటం అసంభవమని తెలిసికూడా.

ఆ నూనె అనాదికాలంలో మోస్తరుగా అలా భూగర్భంలో అణగారి వాయినా మేలేగాని యింగ్లీషువాళ్లను మట్టుకు యిక వుండకూడదనుకున్నాడు. బ్రిటిష్‌వాళ్ల ఆర్థిక పీడనమూలంగా తన దేశం నాశనమైపోయిందని ఆయన బహిరంగంగా ప్రకటించాడు.

అనితూ సర్వత్రా బ్రిటిష్‌వారిపట్ల రేగిన విద్వేషానికి మొసాదిక్ ఒక తొర్రాగానని చెప్పవచ్చు; నిజానికి మొసాదిక్ ... అంటే ... వున్న మనిషి కాడు. కాని, యీ చర్య వల్ల ఇరాన్‌మీద రష్యా ఆధిపత్యం యేర్పడే దుస్థితివచ్చినా సరేగాని, తన పట్టుదలను విడువకూడదని మొండి చరిచాడు.

ఈ చర్యను అరికట్టటానికి బ్రిటిష్ ప్రభుత్వం నానా తంటాలు పడ్డది. ఇరాన్ ఆయిల్ యెవరూకొనొద్దని, ముందుముందు వ్యవహారంలో ... చిక్కులు పడవలసి వస్తుందని ప్రకటించింది. ఇరాన్ ప్రభుత్వం జరుపుతున్న ఈ చర్యను ఆపించవలసిందిగా అంతర్జాతీయ న్యాయస్థానంలో అర్జీ పెట్టుకుంది. ఇరాన్ అంతరంగిక విషయాలను సంబంధించిన ఈ అర్జీని విచారించటానికి తనకు అధికారంలేదని, అంతర్జాతీయ న్యాయస్థానం ఈ అర్జీని త్రోసివేసింది.

దాంతో, యునైటెడ్ ... ప్రస్తుత పరిస్థితిని రాజీవారు ... కోవటానికి ప్రయత్నించుచున్నారు. (సామ్యుల్ రిపార్కర్) (సశేషం.)

# గ్రంథ సమీక్ష

## కరుణాసింధువు

పద్యకావ్యం: గ్రంథకర్తలు: శ్రీ వి. వి. యల్. వి. ప్రసాద్, శ్రీ మారుటూరి పాండురంగా రావుగార్లు. ప్రాప్తిస్థానం మారుటూరి పాండురంగారావు, బ్రాడీపేట 5/15 గుంటూరు వెల 1-4-0.

ఇది నాలు ఆశ్వాసాల ప్రబంధం. గ్రంథంపేరు కరుణాసింధువు. కనుక రచయితలు ఈ ఆశ్వాసాలను తీరంగా లవ్వారు. కరుణా సముద్రుడయిన గౌతమబుద్ధుని చరిత్ర కథావస్తువు. రచనలో తెలుగు నుడికారపు సొంపులు తళతళలుగా మెరుస్తున్నయి.

"గాలినిబీల్చి పచ్చిక సుఖంబుగ మేయుచునుండు నిండు చూలాలిని గొట్టు బాబుల సులాముల చేతులనుండి పోను, గపాల నుగోట్టు దుండగుల పాపములన్నియును జిత్రగుప్తు చిట్టాలకు నెక్కుచుండునె? కటారుల వీరిని జెల్పకుండునె!"

ఈ రచయితలకు వృత్తాలను విసరటంలో మంచి ఒడుపుకూడా అలవడ్డది. ఉదాహరణ,

"కత్తులు పట్టి లేతసారకాయల
కోయుట నేరుపా" మదో
న్మత్త కిరాతదానుష దుర్మార్గ
చర ప్రతిభుల్ నరప్రభుల్",

ప్రథమ తరంగంలో, రచయితలు, మానవుల క్రూరకృత్యాలను ఖండించమిూ జంతువులు జరుపుకున్న ఒక సమావేశాన్ని చిత్రించారు. ఆభాగం చదివితే, మానవుడు వనప్పటిరిగి, తన నాగరికత యేస్థితిలో వున్నదో పరికించుకోవలసిన అవసరం కనుపించుతోంది.

## కుసుమకుంతలము

పద్యకావ్యము; రచన: శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు ప్రాప్తిస్థానం, ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల కాకినాడ వెల 1-8-0.

'అగస్త్య ప్రతిష్ఠితుడైన యీశ్వరునకు పూజారిధర్మిచే కొన్ని ములచుట యుండలి కథావస్తువు.' పలివలక్షేత్ర గాథ. ధారాళమైన శైలిలో కథను, రసవంతంగా చెప్పారు. శివభక్తితత్పరులైనవారికి పూజనీయమైన గ్రంథం.

## కారల్ మార్క్సు జీవితం

రచన: శ్రీ సి. సి. కొండయ్య: ప్రాప్తిస్థానం, అరుణాప్రెస్, నెల్లూరు వెల 2-8-0. కారల్ మార్క్సు జననం ప్రపంచ తాత్వికరంగంలో ఒక మహా విప్లవాన్ని దూకించింది. మార్క్సు కారణంగా అనుభావిత యుగం కార్మికోద్యమ యుగంగా మారింది. మార్క్సు రచనలను చదివేవారు ఆయన జీవిత చరిత్రను కూడా తెలుసుకోవటానికి ఆశించటం సహజం. అట్టివారికి యీ గ్రంథం ఉపయోగ పడుతుంది. ఈ గ్రంథంలో వాడిన తెలుగుభాషమాత్రం చాలా గందరగోళంగా వుంది. మచ్చుకు:

"సాంఘిక దౌర్భాగ్యంనుండి శ్రామిక విప్లవం పుట్టుకొస్తుందని వివరించాడు మార్క్సు. ఈ శాస్త్రీయ— ఉన్నత విప్లవ దృక్పథంనుండే ఆయన సైలీషియన్ చేనేత కార్మికుల తిరుగుబాటును సమర్థిస్తూ ప్రసిద్ధకవి హీన్ లింగ్ అతిరుగుబాటుదారులపై వ్రాసిన పాటలే, ప్రొసిన్‌కలగావులగ సిద్ధాంతాలకన్నా బాగున్నాయని చెప్పుతూ "ఆ నేత గాంధ్రపాట నొకమాటు వినుం. వ్యక్తిగతి ఆస్తి రక్షణకై నిలిచిన ఈ సంఘానికి వ్యతిరేకంగా — కార్మిక వర్గం నిర్దయతో పోరాడుతుంటో" అని హెచ్చరించి, ఆతిరుగుబాటు వీరోచిత పాత్రను ప్రశంసించాడు."

గ్రంథమంతా ఇలాగే అయోమయంగా వుంది. రచయితకు తెలుగు నుడికారపు సాంప్రదాయం పట్టుబడలేదు. భావాలు చీపరపాపర తీగల్లా పెనవేసుకుపోతాయి తప్ప, మెచ్చుకోదగ్గ బంగారు తీగల్లా దేనికదిఇంపుగా కనుపించదు.

## సుహాసిని

చిన్న నవల; రచన: శ్రీ యస్. గోవింద్: ప్రాప్తిస్థానం నవయువ ప్రచురణలు, తెలుపేట గుడివాడ వెల 0-8-0. "వాస్తవిక విషయాలను తీసుకుని సమాజంలో పెద్ద మనుషులుగా చలామణి అయ్యేప్రముఖుల బుజువర్తనాన్ని వెల్లడిచేసి, పీడిత ప్రజానీకాన్ని మేల్కొల్పడానికి తోడ్పడాలని" రచయిత ఆశయం. పీడితప్రజానీకం మేల్కొంటారో లేదో గాని కథ బాగుంది.

## నీటి కాకి

నాటకం: చెకోవ్ వ్రాసిన 'సీగల్' అనే నాటకాన్ని శ్రీ శ్రీనివాస చక్రవర్తి అనుకృతి. ప్రచురణ: సాహిణీ పబ్లికేషన్సు, బకింగ్‌హామ్‌పేట, విజయవాడ 2 వెల రు 1-0-0. పాశ్చాత్య సాహిత్యకారులలో చకోవ్ వాతావరణ కల్పనలోనూ పాత్రనిర్మాణంలోనూ అందవేసిన చెయ్యి. ఆయన రచనను అనువాదంలో పస చెడకుండా తీసుకురావటం మాటలతో పనిగాదు. శ్రీ చక్రవర్తి కొంతవరకు కృతకృత్యులు కాగలిగారనే చెప్పాలి.

## సంతోషము

వ్యాసముల సంపుటి: రచన: శ్రీ ముదిగంటి జగన్నశాస్త్రిగారు. ప్రచురణ పట్టెటూరు గ్రంథమండలి. తణుకు (ప. గోదావరిజిల్లా) వెల రు 1-8-0. ఈ వ్యాససంపుటిలో మానవ జీవితానికి సంబంధించిన అనేక విషయాలను సేకరించి శ్రీ జగన్నశాస్త్రిగారు కూలంకషంగా చర్చించారు. గ్రంథంలో మొత్తం 18 వ్యాసాలున్నయి. సరళమైన గ్రాంథిక భాషలో రచన పరుగులు తెరుకూ సాగుతుంది. శ్రీ శాస్త్రిగారి పాండిత్య ప్రభావం యెక్కడికక్కడే ప్రతిపుటలోనూ ద్యోతకమౌతోంది.

## ప్రేమసాక

నవల: రచన: శ్రీ పి. జయరామరెడ్డి ప్రాప్తిస్థానం: పి. జయరామ్, రామేశ్వరం, ప్రొద్దుటూరు. వెల 1-0-0. విషాద భరితమైన ప్రణయగాథ. ఈ గ్రంథానికి పరిచయవాక్యం వ్రాస్తూ, శ్రీ సుబ్బన్న శతావధానిగారు: "కథా కల్పన కూర్పులేర్పులు ఏవి ఎట్లుండినను ఏదో ఒక తీరనిబాధ రచయిత గుండె అడుగు నుండి, అనుభూతముగా చివరి దనుకవచ్చినది అన్నారు. అదే "ప్రేమసాకకు" జీవము పోసినది" అన్నారు.

## యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృత నాటకమునకు శ్రీ బులుసు వెంకటేశ్వరులు గారి ఆంధ్రానువాదం, ప్రాప్తిస్థానం: శ్రీ బులుసు వెంకటేశ్వరులు, బి. ఏ., గాంధీనగర్ రావుపేట, కాకినాడ. వెల 2-0-0 అనువాదం లోగడ "భారతి"లో సీరియల్‌గా ప్రచురించారు. సరళమైన గ్రాంథికభాష.

## హాలికగీతి

పద్యరచన: గంథకర్త శ్రీ దూతలూరి జగన్నాథను. ప్రాప్తిస్థానం: డి. జగన్నాథం, అన్నధాతి, ఉప్పుటూరు పోస్టు వయా అరువపల్లి, చంగల్పట్ జిల్లా, వెల 0-8-0. రచయితకు కర్షకజీవితం మీద మంచి మెచ్చుకోలు వున్నట్టు కనుపించుతుంది. ఏజీవితం ఎలా వుంటుందో తిరిగి చూస్తేగాని లోతు తెలియడం కష్టం. రచనలో వాస్తవిక దృక్పథంలేదు.

తెలుగురచన: తప్పుల దిద్దుబాటు గ్రంథకర్త: ఉభయభాషా ప్రవీణ వారణాసి రామబ్రహ్మము ఎం. ఏ. ఆంధ్రభాషా ధ్యాపకులు కోనసీమ భానోజీ రామర్సు కళాశాల అమలాపురం (తూ. గో. జిల్లా) వెల 0-14-0

కళాశాల విద్యార్థుల వ్యాసరచన సంస్కరించు ముద్దేశములో వ్రాయబడిన 70 పేజీల పుస్తకమిది. వ్యాసములలో సర్వసామాన్యముగా దొరులు వ్యాకరణ దోషములు చేర్చి నివాటిని పరిహరించు పద్ధతి చూపబడినది. ఇందునిమిత్తం ప్రత్యేకముగా కొన్ని అభ్యాసములుకూడా చేర్చబడినవి. వ్యాసములు ఎలా వ్రాయాలి— విషయ సేకరణ ప్రదర్శనాపద్ధతి ఎలా ఉండాలి— విద్యార్థులకు సులభంగా బోధపడేందుకు దాదాపు 25 నమూనా వ్యాసములిందులో చేర్చబడినవి. వ్యాసరచనను అభివృద్ధి చేసుకొనుటకు కళాశాల విద్యార్థుల కిది చాలా ఉపయోగకరమైన పుస్తకం.

శ్రీ రామలింగ స్వాములవారి జీవితము: శివధిష్టుడు, ద్రవిడభాషా కవియైన శ్రీ రామలింగస్వాములవారి జీవిత మిందు పొందుపరచబడినది. తిరువరుట్పా అను అరవ పద్యముల కొంద్రీకరణముకూడ కలదు. వెల రు 1.

జీవకారుణ్య ఆచరణ: ఈగ్రంథము కూడ శ్రీ రామలింగస్వాములవారి ఉపదేశములు, జీవకారుణ్య ముపూర్చిన వివరణ కలదు. వెల 1-0-0.

ప్రాప్తిస్థానం: సి. జి. రంగనాథం 8/99 అప్పన్‌కోవిలవీధి, కొండితోప్పు, మద్రాసు.

# వారఫలాలు

శ్రీ రావినూతల అంజనేయులు

సెప్టెంబరు 7-వ తేదీ మొదలు
సెప్టెంబరు 13 వ తేదీ వరకు

## గ్రహస్థితి

రవి బుధులు (సింహం) సగురు (వృశ్చికం) గురువు (మేషం) శుక్ర శనులు (కన్య) రాహువు (మకరం) చంద్రుడు (మేష, వృషభ, మిథునములలో).

## రాశ్యంతర గ్రహయోగములు

9 గురువక్రారంభం. 10 కుజ శుక్ర (త్రికోణ దర్శం) 13. బుధ - కుజ (కేంద్రం).

## మార్కెటు మార్పులు

నుండి బంగారాలు 12 వరకు క్రమిగా తేజీలో యుంటవి. 11 నుండి ఆముదమూ— వేరుశనగలూ మొదలైన వాటిల్లో మందం అగపడుతుంది.

## జ్యోతిష విశేషములు

## మీలగ్న (రాశి) ఫలాలు

**మేషం** (అశ్వని, భరణి, కృత్తిక 1-వ పాదం)

ఈ వారంలో గ్రహసంచలనం గత వారంలోకన్న కొంచెం మేలుగా యుంటుంది. 7, 8 ల్లో మీకు సహాయపడగల మిత్రులను కలుస్తారు. ప్రయాణంవల్ల మేలు కలుగుతుంది. శుభకార్యముల్లో నిర్ణయాలు కలుగుతవి. 9, 10, 11 ల్లో మనస్సు నిలకడగా యుండదు. కుటుంబ ఆర్థిక పరిస్థితుల్లో విసుగు ఏర్పడుతుంది. వారాంతంలో ప్రయాణం పరిష్కారాలూ పెట్టుబడులూ లాభించకలవు. ఆరోగ్యం గత వారంలో కన్నా మేలుగా యుంటుంది.

**వృషభం** (కృత్తిక 2,3,4 పాదాలు, రోహిణి, మృగశిర 1, 2 పాదాలు)

ఈ వారంలో బుధ శుక్రులు మాత్రమే కొంత అనుకూలురు. 7, 8 ల్లో ఆరోగ్యభంగం ఆశాభంగం కలిగే సూచనలున్నవి. చట్టాలూ- జూదమూ మొదలైన సాహసకార్యాలకు దూరంగా యుండండి. 9, 10 11 ల్లో కుటుంబ ఆర్థిక పరిస్థితుల్లో అభివృద్ధి కలుగుతుంది. ప్రయాణం అనుకున్నంత లాభకరంగా ముగియదు. ఇంటికి చుట్టాలు రావడంవల్ల ఖర్చులు పెరుగుతవి. వారాంతంలో పెట్టుబడులు ఆపండి. ఆస్తి మార్పులు జరుపడానికి అవకాశాలు కలుగుతవి. 13 ఆరోగ్యభంగం.

**మిథునం** (మృగశిర 3, 4, పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో రవి కుజ గురు శుక్రులు అనుకూలురు. సంఘ వ్యవహారాలను దారికి తీసుక రాకలుగుతారు. ఆర్థిక చిక్కులు కొంత తగ్గుతవి. జవాబు చెప్పగల ధైర్యం కలుగుతుంది. అయినా ఆస్తిమార్పులు ప్రస్తుతం ఆపండి. ఆరోగ్యం మేలుగాయుంటుంది. 7, 8 ల్లో పరిష్కారాలూ పెట్టుబడులూ లాభకరంగా ముగియకలవు. 9, 10, 11 ల్లో ఇరుపైపులా గమనించి వ్యవహరించడం మంచిది. 12, 13 ల్లో మిత్రులను కలుస్తారు. శుభప్రదమైన ఆలోచనలు చేస్తారు.

**కర్కాటకం** (పునర్వసు 4 వ పాదం పుష్యమి, ఆశ్లేష)

ఈవారంలో శని శుక్రులు మాత్రమే మీకు అనుకూలురు. బిడ్డల ఆరోగ్యమునుగురించి కొంత శ్రద్ధ వహించవలసి యుంటుంది. ఆర్థికాభివృద్ధి ప్రయత్నాలకు ఆటంకాలు ఎక్కువ. ఆశాభంగం విసుగూ కలుగుతుంది.

(ఇంకొందరు) దూరంలో యుండే కుటుంబమిత్రుని గురించి కొంత తొందర కలుగవచ్చు. స్పెక్యులేషన్ లాభించదు. 7, 8, 9, 10, 11 ల్లో ప్రయాణం పరిష్కారాలూ లాభకరంగా ముగుస్తవి.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం)

ఈ వారంలో గురు శుక్రులు మాత్రమే మీకు అనుకూలురు. శుభగ్రహబలం కొంత మేలుగా యుండడంవల్ల సలహాదారు కలిసే శ్రేయను ఓర్పుకొనకలుగుతారు. ఖర్చులు పెరిగినా అవసరమునకు పనికివచ్చే డబ్బు చేతికి వస్తూ యుంటుంది. స్వయంగా, భార్యకూ, బిడ్డలకూ ఆరోగ్యం సరిగాయుండదు. అలసటా, నొప్పులూ, బలహీనంవల్ల బాధపడవలసి వస్తుంది. స్పెక్యులేషన్- పెద్ద వ్యాపారాలూ లాభకరంగా యుంటవి. 10, 11 ప్రయాణానికి 12, 13 పెట్టుబడులకూ అనుకూలం.

**కన్య** (ఉత్తర 2, 3, 4 పాదాలు హస్త, చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో కుజ, శుక్రులు మాత్రమే అనుకూలురు. 11 సాయంత్రంవరకూ శరీరానికి మనస్సుకూ శ్రమ కలిగించే ఏ వ్యవహారాలలోనూ ప్రవేశించడం మంచిది కాదు. మీరు ఎంత మానంగా యితరులకు దూరంగాయున్నా పిలిచి నొప్పించేకాలం యిది అని గ్రహించి జాగ్రత్త పడడం మంచిది. కుటుంబ ఆర్థిక పరిస్థితులు కొంత మేలుగానే యుంటవి. స్పెక్యులేషన్ కూడదు. అలాగే ఆస్తి మార్పులుకూడా ఆపండి. వారాంతంలో ప్రయాణానికి మంచిది.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో గురు, శుక్రులూ కొంతవరకు రవి, బుధులూ అనుకూలురు. యిరుపైపులా క్రూరబలం అన్నిరంగాలలోనూ యిరికించి నొప్పించడానికి ప్రయత్నించకలరు. అయినా యుక్తులు కాబట్టి బయటపడకలుగుతారు. వ్యాపార వృత్తుల్లో, ఉద్యోగ నౌకరీల్లో పేరు పెరుగుతుంది. ఆరోగ్యంకూడా కొంత మేలుగా యుండకలదు. పెట్టుబడులు తగ్గించండి. 7, 8 ప్రయాణానికీ మిత్రులనూ, గౌరవస్థులనూ చూడడానికి మంచిది.

**వృశ్చికం** (విశాఖ 4 వ పాదం అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారంలో రవి, బుధ, శుక్ర, శనులు అనుకూలురు. ఆరోగ్యాన్ని కాపాడుకొన కలుగుతారు. సంఘంలో యిరుపైపులా లాగేవారుండడం ఎటూ జవాబు చెప్పలేని పరిస్థితులు కలగడం కలుగుతుంది. ఆర్థికంగాచేసే ప్రయత్నాలు కొనసాగుతవి. మిత్రులకు సహాయపడకలుగుతారు. ఆస్తి కొనుగోలు ప్రయత్నాలు ప్రథమంలో అనుకూలంగాయుండి వారాంతానికి తారుమారు కావచ్చు. 7, 8 ప్రయాణం 9, 10, 11 ల్లో వ్రాతయూ, పెట్టుబడులూ లాభకరం.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ ఉత్తరాషాఢ, 1 వ పాదం)

ఈ వారంలో గురువు మాత్రం అనుకూలుడు. ఈ శుభవీక్షణం యెక్కువే సలుకూరు ఆరోగ్యాన్ని కాపాడుతుంది. ప్రయాణాదుల్లో కలిగే అపాయాలను తప్పించకలదు. 7, 8, ల్లో బద్ధకం ఎక్కువ. 9, 10, 11 ల్లో మీరు తలపెట్టి సాధించలేనిదేమీ యుండదు. సంఘంలో మీకు అనుకూలమైన మార్పులు కలుగుతవి. 12, 13 ల్లో ప్రయాణం పెట్టుబడులూ నూతన యత్నానికి మంచిది.

**మకరం** (ఉత్తరాషాఢ, 2, 3, 4 పాదాలు శ్రవణం ధనిష్ఠ 1, 2,)

ఈ వారంలో కుజుడొకడే అనుకూలుడు. అయినా వృత్తి ఉద్యోగాలను శ్రద్ధలో జరుపకలుగుతారు. కుటుంబంలో మనస్పర్ధలు కలుగవు. కొన్ని అనుకూలమైన స్థితకలిగేవరకుమరికొన్ని చిక్కులు తయారై అవుకూలయుంటవి. ఆరోగ్యం గత వారంలో కన్నా మేలుగా యుంటుంది. వారాంతంలో పరిష్కారాలూ పెట్టుబడులూ తల పెట్టండి. స్పెక్యులేషన్‌లో చివరకు నష్టమే వస్తుంది. 13 శుభవార్త.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో కుజ శనులు మాత్రమే కొంత అనుకూలురు. మనస్సు కొంత చికాకు పొందుతుంది. ఆరోగ్యం తిన్నగా యుండదు. ఏ సమయంలోనైనా ఉష్ణోగ్రత పెరగవచ్చు. కుటుంబపరిస్థితులు తిన్నగాయుండవు. చేతికి వచ్చిన డబ్బు చాలక అప్పులవారికి జవాబు చెప్పుకొనలేని పరిస్థితులు కలుగుతవి. 7, 8 ల్లో ప్రయాణం. 12, 13 ల్లో పరిష్కారాలూ నూతన యత్నం కొంత లాభకరం.

**మీనం** (పూర్వాభాద్ర 4 వ పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో రవి బుధ గురువులు మాత్రం అనుకూలురు. పలుమారు శ్రమతోకూడిన ప్రయాణాలు చేయవలసి యుంటుంది. మనస్సును కలవరపరచే కుటుంబ ఆర్థిక తొందరలు లెస్తవి. కాని ఏ ప్రయత్నంలోనైనా పరిమితి అవసరం. ఆరోగ్యం తిన్నగా యుండదు. వ్యాపారంలో పట్టుదలా-మొండితనం చూపవలసిన పరిస్థితులు కలుగుతవి. 10, 11 ల్లో ప్రయాణం- పెట్టుబడులూ జరపండి.

# పండుగ

(5-వ పేజీ తరువాయి)

తుంది... మరి అంతలో నా పుణ్యవశాత్తూ-అదృష్టమనే అనాలి వెంకట్రావు అంటే నాదగ్గర స్నేహితుడు వెండి ఆ దారినపోతున్నాడు. నా హృదయంలో ఆనందం తొణికిసలాడింది. వెంకట్రావూ - అని పిలిచాను. అతను ఆగాడు - నేను వెంకట్రావును సమీపించాను.

"ఏమిటోయ్ యింతరాత్రప్పుడు వస్తున్నావూ" అని అడిగా.

"ఏమీ లేదోయి, స్టేషనులో పని వుండటంవల్ల ఆలస్యమయింది" అని జవాబిచ్చాడు. నేను గురువులవిషయు తిరిగి" ఇప్పుడు నాన్న చెడుమిటన్నా. రేపు ... కనిపించు - అన్నాను ధైర్యంగా. ... ఏదో గొణుక్కుంటూ పనక్కు మరలిపోయాడు రా డి వెళ్లవ. ఆరాత్రి మా వెంకట్రావుసహాయంలో యిల్లు చేరుకున్నాను.

అయితే ఆ మరునాటినుంచి వారంలో జులదాకా గురువుల వర్తమానం తెలియలేదు. మళ్లీ ఏమున్నా జయిలుకుపోయాడేమో ననుకున్నా, కాని అసలు సంగతి తర్వాత తెలిసింది. ఆసమయంలో నేను ఎంత ఆనందం అనుభవించానో ఆ భగవంతునికే ఎరుక. ఆ సమయంలో ఆంజనేయస్వామికి పది కొబ్బరి కాయలు కొడదామనుకున్నా. శనివిరగడయిపోయిందని సంతోషించాను. నా మండె ఏదో భారం తొలగిపోయినట్లయింది, అసలు విషయమేమిటంటే రెండురోజులక్రితం రైల్వేస్టేషన్‌వద్ద ... రక్తసిక్తమయిన ... . నేనా రోజు పండుగ చేసుకున్నానంటే నమ్మండి.

# దక్షిణ రైల్వే

ఎలహంక, గుంతకల్లు. మైసూరు దక్షిణం, బెంగుళూరు సిటీ, మైసూరు (లోకో కాలనీ)వద్ద నివాస గృహములు కట్టుటకు టెండర్లు.

పై పనులు నిర్వహించుటకు టెండర్లు, తీసికొను తేదీ దిగువ వివరించిన ప్రకారము పొడిగించబడినది:

రీజియనల్ ఇంజనీరుగారి ఆఫీసులో టెంపెర్లు దాఖలు చేసికొనుటకు ఆఖరు తేది 16—9—1952 మ॥ 3 గంటలు

రీజియనల్ ఇంజనీరుగారి ఆఫీసులో టెండర్లు 15—9—1952 తేది మధ్యాహ్నము 12 గంటలవరకు టెండరు ఫారములు యివ్వబడును.

రీజియనల్ అకౌంట్సు ఆఫీసులో బయానాను త్రిము తీసికొనుటకు ఆఖరు తేది 15—9—1952 మ॥ 3 గంటలు

